సంపుటము 2] జనవరి 1916 [సంచిక 7

# బాలమిత్ర



నూతన సంవత్సరపు నాలుక

ప్రియమైన బాలమిత్రులారా!

మీరందరు పాతసంవత్సరమును గడపితిరి. ఏలాగున గడపితిరో మీ కందరికి తెలిసియుండ వలసినదే. పాతసంవత్సరము గడచినది. కొంచెముసేపు మీ పాతసంవత్సరపు నాలుకనుగుఱించి తలంచండి. ఆహా! మనుష్య

నాలుకా! సరిగ నుపయోగించనియెడల అన్ని కీడులకు మూలము. నూతనసంవత్సరము ప్రారంభించినది గనుక పాతసంవత్సరపు నాలుకను దయచేసి కోసివేయండి. ఇతరులను బాగుచేసేది యిదే. ఒకరిని నాశనపుగోతిలోకి దింపేది యిదే. దీని గతసంవత్సరపు దుస్స్వభావములు కొన్నిటిని మాత్రము వివరించెదను.

మొట్టమొదటిది.—కొంతమంది యిక్కడసంగతి అక్కడకు, అక్కడ సంగతి యిక్కడకు ఇతర పనులను మానివేసి, ప్రత్యేకమీపనియే పెట్టుకొని, మోసుకొని వెళ్లుదురు. వారికంత కష్టము ఎందుకు? ప్రియమైన చదువరులారా! చాడీలు చెప్పడమువలననేగదా! దేవుడిచ్చిన మంచినాలుకను, చెండాలపు నాలుకగా మార్చివేయుచున్నారే! చాడీ కోరు నాలుక బంధుమిత్రాదులలో కలహములను రేపుచున్నది.

రెండవది.—కొంతమంది తమ మొదటిస్థితిని మరచి యితరులను వెక్కిరించుచున్నారు. కుంటివారు గుడ్డివారిని వెక్కిరించడము ధర్మమేనా? మాలకాకి నలుపుగానున్నదని జెముడుకాకి అనునట. ఓహో! ఎంతసహజమో చూడుడి. దొంగతనములో ఆరి తేరినవారు అందరికి దొంగతనము కట్టును. కట్టుకొన గుడ్డలేనివారు చింపిరిగుడ్డలు కట్టుకొన్న వానిని హాస్యముచేయుట ధర్మమేనా? ఎంతమాత్రము కాదు.

మూడవది.—మరికొంతమంది తాము అపహాసింపబడుట కిష్టపడరుగాని, వారు ఇతరులను అపహాసించుట న్యాయమేనా? ఇది పాపమే. సలోమోను చెప్పినమాటలను చూడండి. "పరిహాసకుని తోలివేయుము. అప్పుడు కలహములు పోవును." పరిశుద్ధపు గ్రంథములో యీ దిగువ మాటలు చెప్పబడియున్నవి. "నీ కంటిలోనున్న దూలముఎంచక, నీ సహోదరుని కంటిలోనున్న నలుసు చూచుట ఎందుకు?" (మత్తయి-అ. 7, వ. 3).

ఇతరులకు చెప్పేవార్తలు స్నేహవార్తలు గాను, చెప్పవలసిన మాటలుగాను, నిజమైన వార్తలుగానుండవలెను. చదివే నా ప్రియమైనవారలారా! నూతన సంవత్సరము ప్రారంభమైనది గనుక మీరుకూడ మీ నూతనసంవత్సరపు నాలుకను పైచెప్పిన ప్రకారము బాగుగ యీదినము మొదలుకొని, ఉపయోగించుకొందురని నా నమ్మిక. నూతనసంవత్సరపు నా ప్రియ సలాములు.

---

## కాంతమ్మ, కమలమ్మ

కాంతమ్మకు తాతగలడు. ఆయన కాంతమ్మతండ్రికి ఉత్తరము వ్రాసి, ఆమెను రెండువారములవరకు తమతో ఉండనిమ్మని కోరెను. కాంతమ్మ తల్లిదండ్రులు ఆమెను పం

పితే చాలమంచిదని తలంచిరి. కాంతమ్మకు అక్కడికి వెళ్లుటకు చాల సంతోషముగా నుండెను. ఆమెవెళ్లుటకు సిద్ధముగా



నున్నప్పుడు, వారి వంటకత్తె వెంకమ్మ, "సరేగాని కమలమ్మను వారి తాతఅవ్వలు చిన్నయ్య చిన్నమ్మలు మహా గారాబముగా చూచుకొనుచున్నారు. నీకుతగినదే దొరికినదిలే" అని నవ్వుచు ననెను.

కాంతమ్మ, "అట్లానా! కమలమ్మ మంచిదికాకపోతే మళ్లీ యింటికేవస్తాను. నాన్నగారూ! మనమిక వెళ్లుదాము రండి" అని కాంతమ్మ బయలుదేరెను.

వారిద్దరు దాటి అవతలకు పోయినతరువాత, తల్లి వెంక మ్మతో “కాంత మళ్లీ తనతండ్రితో వచ్చినయెడల నాకంత ఆశ్చర్యము కాదు. అబ్బా రెండువారములదాకా ఆమె అక్కడనే ఉంటే, నాకు దానిమీద దిగులువేయును” అనెను.

తండ్రి తిరిగివచ్చెను. కాంతమ్మ అతనివెంట రాలేదు. కమలమ్మను చూడగానే ఆమెకు దానియందు ప్రేమపుట్టెను. తా ననుకొన్నదానికి విరుద్ధముగానున్నందున, ఆమె తాన క్కడనే ఉండగోరెను.

మొదటివారమైనపిదప కాంతమ్మ ఒక్కతె తోటలో ఉయ్యాల ఊగుచు, దీర్ఘాలోచన చేయుచుండెను. కమలమ్మను గూర్చియు తననుగూర్చియు తలంచుచుండెను. వారిద్దరి సంగతులకు చాల భేదమున్నది. తన యింటియొద్ద అందరును తననుగూర్చి తలంచువారే. కాంతమ్మ చాల గారాబముగా పెరిగినదని వెంకమ్మ అనినదిగాని, అలాగేమియు కనుపడ లేదు. “తాతగారికి చాల సహాయకరముగానున్నది.” చెప్పులు కర్ర వెదకి, కావలసినప్పుడు తెచ్చిచ్చుచుండును. అవ్వగారికి ఏకులబుట్టను నీళ్లునిప్పులను అందించును. ప్రతిదినము చిన్న య్యగారి నెదుర్కొనవెళ్లి, ఏదైనా చిన్నచిన్నమాటలను తెచ్చుటలో సహాయముచేయును. చిన్నమ్మకు గిన్నె చెంబులు తోమి, వంటపనిలో చెయ్యితోడుగా నుండును. ఆమెకు తనంత

వయస్సేఉన్నను, తనకంటె ఎన్నోయెక్కువ పనులు తెలి యును. ఆమె తననుగూర్చిగాక యితరులకు సహాయము చేయుటకు నేర్చుకొనినదని కాంతమ్మ ఆనాడు తలంచు చుండెను.

ఈ సంగతులన్నియు ఆలోచించుచుండగా ఆమె ముఖ మెర్ర బారెను. తన స్థితియంతయు బాగుగా కనుబడెను. ఇంటిదగ్గర, తా నెవరికిని సహాయము చేయునదికాదు. అంద రును తననే చూడవలసి యుండెను. ఉన్నట్లుండి ఆమె కండ్ల వెంట జలజలమని నీరువచ్చెను. దుఃఖ మాపుకొనలేక పో యెను. “నే నిక్కడ ఉండునప్పుడు, వారు నిజముగా విశ్రాంతిగా నున్నారు. నేను వారికెంత ఆటంకముగా నున్నాను?” అని ఆమె తలంచెను.

ఆ ఉయ్యాలవదలి, పరుగెత్తుకొని లోపలికి పోయెను. “తాతా! కమలయెక్కడ?”

“వెనుకవైపున ఉన్నదికాబోలు”

కాంతమ్మ అక్కడకు పోబోయెను. ఇంతలో అవ్వ మిద్దె పైనున్న ఏకులబుట్టను పట్టుకొని దిగుచుండుట కనుపడెను. “అవ్వా, నే తెస్తాను, దానినిట్లా తే” అని కాంతచెప్పెను. వద్దనునేమోయని తలంచెనుగాని, అవ్వ సంతోషముతో దాని నామె కందించెను. వారిద్దరు ఆ దినమున యెంతో కులా

సాగా కాలముగడిపిరి. కాంతమ్మ అవ్వకు నూలువడుకుటలో సహాయముచేసెను. «అవ్వా! కమల నాకు గారెలుచేయుట నేర్పునా?»

«ఎందుకునేర్పదు? చాల సంతోషముతో నేర్పును» అని అవ్వఅనెను. చిన్నాయన వచ్చుచుండగా నెదురుగాబోయి, కాంతమ్మ «నే నింటికిబోయినపిమ్మట, కమలవలెనే చేసెదను, వారెంతో ఆశ్చర్యపడుదురని» చెప్పెను.

రెండువారములైన తరువాత, ఆమె తనయింటికి పోయెను. వెళ్లిననాడే తండ్రికి కాళ్లకు నీళ్లిచ్చియు, తల్లి కనేకవిధములుగా సహాయపడియు, వారి కాశ్చర్యము కలిగించెను. మరుసటి ఉదయము, ఆమె వెంకమ్మతో «వెంకమ్మా, నీ పని అయిన తరువాత నేను పిట్టు చేయబోతున్నాను. సహాయము చేతువా?» అనెను.

«పిట్టుచేయుడానకా! నాకు చేతకాదు.»

«కమలకు తగినదానివలెనే ఉండవలెనని ప్రయత్నించుచున్నాను. వెంకమ్మా, కమల ఏమనుకొంటున్నావు? పిట్టు చేసినపిదప ఆమెనుగూర్చి చెప్పెదను. అది చాల చిత్రమైనది.»

ఆ సంగతిని చెప్పినప్పుడు వెంకమ్మ నోరుతెరచుకొని వినెను. తల్లిదండ్రులు ఆశ్చర్యపడిరి.

ఈవిధముగా కమలమ్మ, తన యింటియొద్దమాత్రమేగాక, ఇతరులఇంటిలో మంచిపని చేసినది.

---

## కప్ప



కప్పలు చేపలను పట్టుకొనును. ఈ సంగతి ఎప్పుడైనను విన్నారా? అన్నికప్పలు ఈలాగు చేయనేరవు. ఈ జాతికప్ప కన్నిటికంటె పెద్దనోరుగలదు. దాని వీపుపై మూడు చారలవంటి చర్మపుభాగములు గలవు. వీటిలో పొడుగాటిదాని నది నీటిలోకిచాపి మెల్లగా కదలించుచుం డును. ఈలాగు చేపలను వేటాడునప్పు డది జమ్ములోగాని బురదలోగాని దాగియుండును. ఏదైన నొక చిన్నచేప కదలుచున్న దాని నోటియొద్దకు రాగానే లటుక్కున అది నోరుమూసికొని దానిని మ్రింగివేయును.

ఒకతరహా చేపకూడ తన ఆహారమును చిత్రముగా పట్టుకొనును. అది పట్టుకొన దలంచిన పురుగేదైన ఆకుమీదగాని, దేనిమీదగాని వ్రాలినప్పుడు, అది నీటిని అంబువలె సూటిగా దానిపైకి కొట్టును. వెంటనే దిమ్మరపోయి ఆ పురుగు క్రింద బడును. అప్పుడా చేప దానినిపట్టి తినివేయును.

---

## పూసలబ్బి

ఒక పూసలబ్బి కేకవేయుచు వీధిని బోవుచుండగా చిన్నపిల్లయొకతె వానిని బిలిచి—అబ్బీ అణా కెన్నిపూసలు? అని యడిగెను. అణాకు ముప్పదిపూసలని వాడు బదులుచెప్ప—ఆఁ! అణాకు అరువై పూసలు...ఆనాడు అమ్మకొనలేదా? యని చిన్నది పలికెను. అట్లే తీసికొమ్మని ఆ యబ్బి సమ్మతింప, ఒక్కొక్కటె లెక్కపెట్టి యిమ్మని చిన్నది కోరెను.

పూసలబ్బి:—అట్లాగే నమ్మా, చెయ్యిపట్టు. లాభం, రెండు, మూడు—అయితే, అమ్మాయీ! నీ కెన్నేళ్లు?

చిన్నది:— నాకా? నా కెనిమిదేళ్లు.

పూసలబ్బి:—యెనిమి దేమిటమ్మా! యెనిమిది, తొమ్మిది, పది, పదకొండు—అయితే మీ అమ్మ కెన్నేళ్లమ్మా?

చిన్నది:— మా అమ్మకా? ముప్ఫయిరెండు.

పూసలబ్బి:—ముప్ఫయిరెండు, ముప్ఫయిమూడు, ముప్ఫయి
నాలుగు—మీ నాన్నకో?

చిన్నది:— నాన్నకు నలభై

పూసలబ్బి:—నలభై, నలభయ్యొకటి, నలభై రెండు-మీఅమ్మకు?

చిన్నది:— అమ్మకు కాదు, బామ్మ,

పూసలబ్బి:—బామ్మకే

చిన్నది:— యాభై యారు.

పూసలబ్బి:—యాభయ్యారు, యాభయ్యేడు, యాభయ్యెనిమిది,
యాభయితొమ్మిది, అరవై. అరవై పూసలు—
ఒక్కణా.

చిన్నది అణా చేతబెట్టగా దీసికొని—అమ్మాయీ! పూసలు జాగ్రత సుమీ! క్రింద పారబోశేవు. అని బుద్ధిచెప్పి ఆ యబ్బి మరియొక వీధికి వెడలిపోయెను. వెళ్లుచుండగా దారిలో ఆ యబ్బికి తెలియకుండగనే పూసలుసంచినుండి క్రింద బడిపోయెను. పూసలబ్బి అది కానక మరియొక యింటికి వెళ్లినప్పుడు పూసలు తక్కువగుట కనుగొని—అయ్యో నేను ఆ చిన్నదానిని మరిపించితిగనుక దేవుడు నన్ను మరిపించినాడు, అని అనుకొని ఆ నాటినుండి ఎవరినైనను మోసముచేయలేదు.

"మోసపోకుడి, దేవుడు వెక్కిరించబడడు"

# ప్రకృతి పాఠములు

## 18-వ పాఠము

### రసముచే చేయబడునది

చెట్టునందు నీకు కనుబడు ప్రతిదియు, రసముచేత చేయ బడుచున్నది. బెరడు, చెక్క, ఆకులు, పువ్వులు, కాయలు, పండ్లు మొదలగునవన్నియు ఈ రసముచేతనే కలుగుచున్నవి. నేలనుండి ఈ రసమును పైకి పీల్చుకొను వేళ్లుకూడా దీని వలననే చేయబడుచున్నవి.

ఈ రసమునుండియే ఇన్ని వేరుపదార్థములన్నియు కలుగుట ఆశ్చర్యముగదా! కఠినముగానుండు బెరడును, గట్టిగానుండు చెక్కయు, సుందరమగు పువ్వును తియ్యని పండును ఒక రసముచేతనే కలుగుట చాల వింతగానున్నది. మామిడి పండును మామిడి బెరడును దగ్గరఉంచి చూచినయెడల, ఎంత భేద మగుపడును, అయినను అవి ఒక్కపదార్థముతోనే కలిగినవి. గులాబిమండకున్న ముండ్లును ఆ చెట్టుపై వికసించిన మనోహరమగు పువ్వును ఒకదానివలననే చేయబడెను.

ఎవడైనను, ఇటుకరాతిని, చక్కనిబట్టను ఒకటే పదార్థము నుండి చేయగలనని చెప్పితే, వాని పిచ్చివాడందువుగదా

బెరడుకు పువ్వు కెట్టిభేదమున్నదో, ఇటుకకు, బట్టకు, అంతే భేదమున్నది. మొదటివి సృష్టికర్త చేసినాడు. గాని ఇటుక మొదలైన వానిని మనుష్యుడు చేసినాడు.

పైన చెప్పినవిగాక రసముచే చేయబడిన వెన్నియో గలవు. వానిలో కొన్ని చేదుగాను, కొన్ని తియ్యగాను, కొన్ని పుల్ల గాను, మరికొన్ని వగరుగాను ఉన్నవి. అప్పుడప్పుడు తీయ నివి చేదువి ఒకటేరసమునుండి చేయబడుచున్నవి. నారింజ పండు చూడుము లోని తియ్యటితొనలు బైటి చేదుతోలు ఒక కాడలోనుండివచ్చిన రసముతోనే చేయబడినవి.

చక్కెర, చెరకునుండి తీయబడుచున్నది. కొన్ని చెట్లలో పిండి పదార్థమున్నది. మరికొన్నిటిలోనుంచి మందులు చేయ బడుచున్నవి.

---

# బైబిలు పిల్లలు

## యోసేపు

“పిల్లలారా మీ తల్లిదండ్రులమాట వినుడి”

కొలస్సై 3: 20

పూర్వకాలమందు యాకోబను నొక గొఱ్ఱలకాపరి యుం డెను. ఈయన కనాను దేశములో నివసించుచుండెను. అతనికి చాలా మేకలు, గొఱ్ఱలు, ఒంటెలు యుండెను.

కాబట్టి ఆయన పచ్చికగల చోట్లలోనికి వానిని దీసుకవెళ్లి మేపుచుండెను.



యాకోబుకు పన్నెండుమంది కుమారులుండిరి. వారిలో బలముగలిగి, పెద్దవారుగా నుండువారిని గొఱ్ఱెలను మేపుటకై పంపుచుండెను. అయితే చిన్నవారు యిద్దరు మాత్రమే తండ్రి తోకూడ యుండిరి. వారిలో నొకనిపేరు, యోసేపు. ఈయన చాలా దయగలవాడు. ఆయన మృదువైనవాడును చక్కని వాడునై యుండెను. కాబట్టి అతనిని తండ్రి యెక్కువ

ప్రేమించుచుండెను. యోసేపుకూడ తన తండ్రిని బాగుగ ప్రేమించి అన్నిటిలో ఆయనకు సహాయము చేయుచుండెను.

తండ్రి ఆయన నెక్కువ ప్రేమించుటవల్ల, అన్నలందరికిని, యోసేపుమీద కోపముగలదు.

ఒకసారి యోసేపుయొక్క అన్నలు గొఱ్ఱెలను మేపుటకై చాలాదూరము పోయి యుండిరి. అప్పుడు యాకోబు తన బిడ్డల సమాచారము తెలిసికొనవలయుననియు, వారికి భోజనము పంపవలయునని తలంచెను. అప్పుడు తన ప్రియ కుమారుడగు యోసేపును పిలిచి, వారియొద్దకు పొమ్మని చెప్పెను. యోసేపు సంతోషముగా అన్నలయొద్దకు వెళ్లెద నని చెప్పెను. అప్పుడు తండ్రి సంతోషించి కుమారుని ఆశీర్వదించి పంపెను. యోసేపుకు తన అన్నలు తనమీద కోపముగా యున్నారని తెలిసియుండినను, వారియొద్దకు వెళ్లెను. కాబట్టి యోసేపు తన తండ్రికి విధేయుడై యుండె నని తెలియుచున్నది.

దేవుడు కూడ యోసేపును యెక్కువగా ప్రేమించి, ఆశీర్వదించి ఆయనను అభివృద్ధిపరచెను.

తల్లిదండ్రులను ఘనపరచి, ప్రేమించు బిడ్డలను, దేవుడు కూడ ప్రేమించును. దీనిని చదువు చిన్న బిడ్డలారా! మీరు మీ తల్లిదండ్రుల ప్రేమను, దేవుని ప్రేమను పొందవలయునని

కోరినవారైతే వారికి విధేయులై యుండవలెను. వారు మిమ్మును ప్రేమించిన ప్రకారము మీరును వారిని ప్రేమింపవలెను. మీ ప్రేమ నేవిధముగా చూపగలరనగా మీరు మీ తల్లిదండ్రులకు లోబడుటవలన చూపగలరు.

---

## బాలమిత్ర టపా

ప్రియ. బాలమిత్రులారా!

ప్రియమైన బాలమిత్రను చదివెడి బాలికా బాలురారా!

నేను ప్రతినెల బాలమిత్రను చదువుచుండుటవలన నేను కూడ మీకొక ఉత్తరము వ్రాయవలయునని అనుకొని ఇప్పుడు ఒకటి వ్రాయుచున్నాను.

నేను హిందువుడను. నేను ఎ., ఇ. ఎల్. యం. బోర్డింగునకు రాకపూర్వము నాకు బైబిల్ వాక్యము యేమాత్రమును తెలియదు. నేను ఇప్పుడు గుంటూరు ఎ., ఇ. ఎల్. యం. మగపిల్లల బోర్డింగులో చేరినప్పటినుండి మా దొరగారు మాకొక్క బైబిల్ మాస్టరుగారిని నియమించి ప్రతి రోజు సాయంతరము ఒక అరగంట దేవుని వాక్యము నేర్పించెదరు. అదియును గాక మాకు ప్రతిరోజు 7 ఘంటలు మొదలు $7\frac{1}{2}$ గంటల వరకు ప్రార్థన సమాజముండును. మా బోర్డింగులో సుమారు




28 మంది హిందువులు గలరు. వారిలో 6 గురు కాలేజిలో నున్నా 17 గురు బ్రాంచిస్కూలులో నున్నా యిద్దరు యెలిమెంటరిలో నున్నా ముగ్గురు ట్రైనింగు స్కూలులోనున్నా చదువుచున్నారు.

నేను ఇప్పుడు దేవుని దయవలన నాల్గవ తరగతి చదువుచున్నాను. మీరు దేవుని గురించిన సంగతులు ఎక్కువగా నేర్చుకొని ఎక్కువ వృద్ధిలోనికి రావలయునని నా అభిప్రాయమై యున్నది.

ఇట్లు మీ ప్రియబాలమిత్రుడు
కటికల పిచ్చియ్య, వేములూరిపాడు

C. L. S. PRESS, MADRAS—1916